# విషయ సూచిక

"**THE GAYATRI MANTRA**" the most powerful hymn in the world

Dr. Howard steingeril, an american scientist, collected Mantras, Hymns and invocations from all over the world and tested for their strength in his physiology Laboratory & Hindu's Gayatri Mantra produced 110,000 sound waves / second..

This was the highest and was found to be the most powerful hymn in the world. Through the combination of sound or sound waves of a particular frequency, this Mantra is claimed to be capable of developing specific spiritual potentialities.
The Hamburg university initiated research into the efficacy of the Gayatri Mantra both on the mental and physical plane of CREATION...

The Gayatri Mantra is broadcasted daily for 15 minutes from 7 a.m. omwards over Radio Paramaribo, Surinam, South America for the past two years, and in Amsterdam, Holland last six months.

"Om Bhoor Bhuwah Swah, Tat Savitur Varenyam, Bhargo Devasya Dheemahi, Dhiyo Yo Nah Pra-chodayat..! "

"It's Meaning :

God is dear to me like my own breath, he is the dispeller of my pains, and giver of happiness, I meditate on the supremely adorable light of the Divine Creator, that it may inspire my thought and understanding "

The above information is worth circulating and sharing with one and al l HOW rich and wonderful are our vedas.

I'am proud to SHARE...

"గాయత్రీ మంత్రము" ప్రపంచంలోనే అత్యంత శక్తివంతమైన మంత్రము.డా॥ హోవార్డ్ స్టెన్‌గిరిల్ అనే అమెరికా శాస్త్రవేత్త ప్రపంచములోని అన్ని మంత్రాలను, కీర్తనలను, భక్తి గీతాలను సేకరించి వాటి శక్తి, సామర్థ్యాలను అనేక విధాలుగా తన ప్రయోగశాలలో పరీక్షించి కనుగొన్నది ఏమిటంటే.. " హిందువుల గాయత్రీ మంత్రము" ఒక సెకనుకు 110,000 ధ్వని తరంగాలను ఉత్పత్తి చేసింది.

ఇది ప్రపంచంలోని అన్నిటీ కన్నా ఎక్కువ మరియు అన్ని మంత్రాల కన్నా ఎంతో శక్తివంతమైనదని నిరూపించబడినది. ఈ మంత్రములోని అక్షరముల సంయోగము స్వరయుక్తముగా మళ్ళీ మళ్ళీ ఉచ్చరించడము / జపించడము ద్వారా వెలువడే ధ్వని తరంగాల వలన ఈ మంత్రము ఒక ప్రత్యేకమైన ఆధ్యాత్మిక స్థాయిని పెంపొందిస్తుందని తేలింది. హేంబర్గ్ విశ్వవిద్యాలయము ఒక పరిశోధన మొదలు పెట్టింది. "గాయత్రీ మంత్రము" యొక్క ప్రభావము మానవుల శారీరక మరియు మానసిక సామర్థ్యముపై ఎలా ఉంటుందనే అంశముపైన, అందులో భాగంగానే "గాయత్రీ మంత్రము" ను ప్రతి రోజు 15 ని॥లు ఉదయము 7 గం॥లకు రేడియోలో పరమారిబో, సురినామ్, దక్షిణ అమెరికలో గత 2 సం॥ల నుండి మరియు అమ్‌స్టర్‌డామ్, హాలండ్‌లో గత 6 నెలలుగా ప్రసారము చేయబడుతుంది.

**" ఓమ్ భూర్భువ స్వః తత్సవితుర్వరేణ్యం ।**
**భర్గో దేవస్య ధీమహి ధియో యోనః ప్రచోదయాత్ ॥**

అర్థము :

"భగవంతుడు నా దగ్గరే ఉన్నాడు నా శ్వాసలాగా, ఆ పరబ్రహ్మ స్వరూపమే నా బాధలన్నింటినీ తొలగించి సుఖసంతోషాలను ప్రసాదిస్తుంది. పరిపూర్ణమైన స్వయంజ్యోతి స్వరూపము. సృష్టి స్థితి లయ కారకము మా యొక్క బుద్ధి పవృత్తులను ప్రేరేపించు అంతర్యామి యగు ఏ దివ్య తేజస్సుగలదో, అట్టి దివ్య తేజస్సును మా బుద్ధులను సన్మార్గమున ప్రేరేపించుగాక అని ఆ పరబ్రహ్మ తేజస్సును మేము ధ్యానించెదము".
పై సమాచారము అందరికి చేరవేయుటకు, ప్రచారము చేయటానకి మరియు అందరితో పంచుకోవడానికి చాలా చాలా యోగ్యమైనది. ఎంతసుసంపన్నమైనవి మన వేదాలు. దీనిని అందరితో పంచుకుంటున్నందుకు ఎంతగానో గర్వపడుతున్నాను.

## సంధ్యావందనము మరియు గాయత్రీమంత్ర విశిష్ఠత, ఆవశ్యకత..

**గాయత్ర్యాస్తు పరం నాస్తి ఇహలోకే పరత్ర చ ॥**
**గాయంతం త్రాయతే యస్మాద్గాయత్రీత్యభిధీయతే ॥**

గాయత్రీ కన్నా గొప్ప మంత్రము ఇహపరాలలో ఎక్కడా లేదు.
గానం చేసేవాడిని (జపించేవాడిని) కాపాడుతుంది.
కనక గాయత్రీ అన్నారు.

**న గాయత్ర్యాః పరం మంత్రం ।**
**న మాతుః పర దైవతమ్ ॥**

గాయత్రీ మంత్రము కన్నా గొప్ప మంత్రము,
తల్లి కన్నా గొప్ప దైవము లేదు

**అవిద్యోవా సవిద్యోవా బ్రహ్మణోమామకీతనుః।**

**కాలేవాయది వాకాలే సంధ్యా వందన తత్పర ॥**

విద్యావంతుడైన విద్యావంతుడు కాకపోయిన నిత్యం సంధ్యావందన తత్పరుడైన బ్రాహ్మణుని తన వానిగా పరిగణిస్తానని గాయత్రీ మాతా వచనము.

**జీవహీనో యథా దేహస్సర్వ కర్మసు న క్షమః ।**
**పునశ్చరణ హీనస్తు తథా మంత్రః ప్రకీర్తితః ॥**

ప్రాణం లేని దేహం లాంటిది. పునశ్చరణ లేని మంత్రము ఎందుకు పనికిరాదు. అందువలన గాయత్రీ మంత్ర సిద్ధి కొరకు తప్పకుండ గాయత్రీ మంత్ర పునశ్చరణ చేయాలి. గాయత్రీ ఛందస్సులో అక్షరానికి లక్ష చొప్పున ఇరవై నాలుగు లక్షలు మంత్రాన్ని పునశ్చరణ చేయాలి.

## గాయత్రీ మంత్రాక్షర మహిమ

**కుర్వాదన్యన్న వా కుర్వాదనుష్ఠానాధికం తథా ।**
**గాయత్రీమాత్ర నిష్ఠస్తు కృతకృత్యో భవేత్ ద్విజః ॥**
**సంధ్యాసు చార్ఘ్య దానం చ గాయత్రీ జపమేవచ ।**
**సహస్రత్రితయం కుర్వన్ సురైః పూజ్యో భవేన్మునే ॥**

తక్కిన అనుష్ఠానాలను వేటిని చేసినా చెయ్యకపోయినా గాయత్రీని చేస్తే చాలు. ద్విజుడు కృతకృత్యుడైనట్లే. మూడు సంధ్యల్లోనూ ఆర్ఘ్యమిచ్చి మూడు వేలు గాయత్రీ జపం చేస్తే అదే పదివేలు. దేవతలకు కూడా పూజ్యుడవుతాడు.ఇందువలన గాయత్రీ మహామంత్ర పునశ్చరణ అత్యంత పుణ్యప్రదము. అభీష్టదాయకము. ఈ పునశ్చరణ పర్వతాగ్రం, నదీతీరం, బిల్వమూలం, జలాశయం, గోశాల, దేవాలయం, అశ్వత్థవృక్షం, తులసి తోట, పుణ్యక్షేత్రం, గురుసన్నిధి, ఇంటిలోనూ, ఇలా ఎక్కడైనా గానీ మనస్సును ఏకాగ్ర చిత్తంతో ఉంచి ఈ పునశ్చరణ చేస్తే మంత్ర ఫలసిద్ధి కలుగుతుంది.

**విప్రోవృక్షో మూలకాన్యత్ర సంధ్య ।**
**వేదాః శాస్త్రాః ధర్మ కర్మాణి పత్రం ॥**
**తస్మాన్మూలం యత్నతో రక్షణీయం ।**
**ఛిన్నేమూలేనైవ శాఖాః న పత్రమ్ ॥**

ద్విజులకు సంధ్యావందనము గాయత్రీ మంత్రోపాసన రెండే ముఖ్యమైన విధులు. ఈ రెండు ద్విజులు అనే వృక్షానికి వ్రేళ్ళ వంటివి. వ్రేళ్ళను జాగ్రత్తగా రక్షించవలెను. వ్రేళ్ళు నష్టమైనచో వృక్షము,శాఖలు, పత్రములు ఏవీ మిగలవు. అందువలన అందరు తప్పకుండా సంధ్యావందనము, గాయత్రోపాసన ఆచరించాలి.

ఈ రెండు ఆచరిస్తే తప్ప దేనికి అర్హత రాదు. అందువలన విప్రులందరూ సంధ్యావందనము, గాయత్రీ మహామంత్ర ఉపాసన చేసి దేవతార్చనతో పాటు పిత్రార్చనకు యోగ్యత సంపాదించడంతో పాటు శ్రీ గాయత్రీ మాతా అనుగ్రహము పొందగలరు. ఇవి చేయనిదే ఎన్ని చేసినా అన్నియు జల్లెడలో పోసిన నీళ్ళలా వ్యర్థమైపోతాయని వేదోక్తి.

## గాయత్రీ మహా మంత్రములోని 24 అక్షరముల విశిష్ఠత (శ్రీదేవి భాగవతము)

| అక్షరము శక్తి | దేవత | ఋషి | ఛందస్సు | అధిదేవతా | అది దేవతా శక్తి | వర్ణం | తత్వం | ముద్ర |
|---|---|---|---|---|---|---|---|---|
| 1) తత్ | గణేశ్వరుడు | వామదేవుడు | గాయత్రీ | అగ్ని | వామదేవి | సంపంగిపువ్వు | పృథివి | సుముఖం |
| 2) స | నృసింహమూర్తి | అత్రి | ఉష్ణిక్ | ప్రజాపతి | ప్రియ | అతసీ | జలం | సంపుటం |
| 3) వి | విష్ణువు | వసిష్ఠుడు | అనుష్టుప్ | సోమదేవతాకం | సత్య | పగడం | తేజస్సు | వితతం |
| 4) తుః | శివుడు | శుక్రుడు | బృహతి | ఈశాన | విశ్వ | స్ఫటిక | వాయువు | విస్తృతం |
| 5) వ | కృష్ణుడు | కణ్వుడు | పంక్తి | సవితృ | భద్రవిలాసిని | పద్మ | ఆకాశం | ద్విముఖం |
| 6) రే | రాధాదేవి | పరాశరుడు | త్రిష్టుప్ | ఆదిత్య | ప్రభావతి | తరుణాధిత్య సన్నిభం | గంధం | త్రిముఖం |
| 7) ణ్యం | లక్ష్మీదేవి | విశ్వామిత్రుడు | జగతి | బృహస్పతి | జయ | శంఖచంద్ర సమప్రభం | రసం | చతుర్ముఖం |
| 8) భ | అగ్నిదేవుడు | కపిలుడు | అతిజగతి | మిత్రావరుణ | శాంత | చిగురాకు | రూపం | పంచముఖం |
| 9) ర్గోః | ఇంద్రుడు | శౌనకుడు | శక్వరి | భగ దేవతాకం | కాంత | పద్మరాగము | శబ్దం | షణ్ముకం |

## గాయత్రీ మహా మంత్రములోని 24 అక్షరముల విశిష్ఠత (శ్రీదేవి భాగవతము)

| అక్షరము శక్తి | దేవత | ఋషి | ఛందస్సు | అధిదేవతా | అది దేవతా శక్తి | వర్ణం | తత్వం | ముద్ర |
|---|---|---|---|---|---|---|---|---|
| 10) ధే | సరస్వతి | యాజ్ఞవల్క్యుడు | అతిశక్వరి | ఆర్యమ | దుర్గ | ఇంద్రనీలము | స్పర్శ | అధోముఖం |
| 11) వ | దుర్గాదేవి | భరద్వాజుడు | దృతి | గణేశ | సరస్వతి | ముత్యము | ఉపస్థం | వ్యాపకాంజలికం |
| 12) స్య | హనుమంతుడు | జమదగ్ని | అతిదృతి | త్వష్ట | విద్రుమ | కుంకుమ | పాయువు | శకటం |
| 13) ధీ | భూమాతా | గౌతముడు | విరాట్ | పౌష్ణ | విశాలేశ | కాటుక | పాదం | యమపాశంచ |
| 14) మ | సూర్యదేవుడు | ముద్గలుడు | ప్రసారపంక్తి | ఇంద్రాగ్ని | వ్యాపిని | రక్తవర్ణం | పాణి | గ్రధితం |
| 15) హి | శ్రీరాముడు | వేదవ్యాసుడు | కృతి | వాయవ్య | విమల | వైడూర్యం | వాక్కు | సమ్ముఖోన్ముఖం |
| 16) ధి | సీతామాత | లోమశుడు | ప్రకృతి | వామ | తమోపహారిణి | క్షౌద్రవర్ణం | ఘ్రాణం | విలంబం |
| 17) యో | చంద్రుడు | అగస్త్యుడు | ఆకృతి | మైత్రావరుణి | సూక్ష్మ | పసుపు | జిహ్వ | ముష్టికం |
| 18) యో | యమదేవుడు | కౌశికుడు | వికృతి | వైశ్యదేవం | విశ్వయోని | మొల్లపవ్వు | చక్షుస్సు | మత్స్యం |

## గాయత్రీ మహా మంత్రములోని 24 అక్షరముల విశిష్ఠత (శ్రీదేవి భాగవతము)

| అక్షరము శక్తి | దేవత | ఋషి | ఛందస్సు | అధిదేవతా | అది దేవతా శక్తి | వర్ణం | తత్వం | ముద్ర |
|---|---|---|---|---|---|---|---|---|
| 19) నః | బ్రహ్మదేవుడు | వత్సుడు | సంకృతి | మాతృదేవతాకం | నిరయ | సూర్యకాంతి | త్వక్కు | కూర్మం |
| 20) ప్ర | వరుణదేవుడు | పులస్త్యుడు | అక్షర పంక్తి | విష్ణువు | వశ | చిలకతోక | శ్రోతం | వరాహం |
| 21) చో | నారాయణుడు | మాండుకుడు | భూః | వసు | పద్మాలయ | శతపత్రంనిభం | ప్రాణం | సింహాక్రాంతం |
| 22) ద | హయగ్రీవుడు | దుర్వాసుడు | భువః | రుద్ర | పరశోభ | కేతకిపుష్పం | అపానం | మహాక్రాంతం |
| 23) యా | హంసదేవత | నారదుడు | స్వః | కుబేర | భద్ర | మల్లికాకుసుమం | వ్యానం | ముద్గరం |
| 24) త్ | తులసీదేవి | కశ్యపుడు | జ్యోతిష్మతి | అశ్విని | ద్రుపద | కరవీర | సమానం | పల్లవం |

ఇందువలననే "న గాయత్ర్యా : పరం మంత్రం " గాయత్రీ మహామంత్రముతో సమానమైన మంత్రము ఇహ పరాలలో ఎక్కడా లేదనేది

## గాయత్రీ మంత్రమహిమపై పూజ్యుల ప్రశంసా సారాంశములు

**1)విశ్వామిత్ర వచనాలు :-**

గాయత్రీ మంత్రంతో సమానమైన మంత్రం నాలుగు వేదాలలోనూ లేదు. సంపూర్ణ వేద, యజ్ఞ, దాన, జప, తపాదులు - గాయత్రీ మంత్రంలోని ఓ కళకు కూడా సమానము కాజాలవు.

**2) శ్రీ మనువు (మనుస్మృతిలో) :-**

బ్రహ్మదేవుడు మూడువేదాల నుండి సారాన్ని గ్రహించి, త్రిపదాలు గల గాయత్రీ మంత్రసృష్టి చేశాడు. గాయత్రిని మించి పవిత్రం చేయునట్టి అన్యమంత్రమేదీ లేదు. నియమబద్ధంగా 3 సం॥రాలు గాయత్రీ మంత్రాన్ని జపించునట్టివాడు భగవంతుణ్ణి పొందగలుగుతాడు. రెండు సంధ్యల యందునా గాయత్రీని జపించేవాడు వేదాధ్యయన ఫలాన్ని పొందుతాడు. అట్టివాడు, ఇతరేతర సాధనలు చేసినా చేయకపోయినా గాయత్రీ జపసిద్ధిని పొందగలుగుతాడు.

**3) యాజ్ఞవల్క్యుని అభిమతంలో :-**

గంగతో సమానమైన తీర్థం ఏదీ లేదు. కేశవుణ్ణి మించిన శ్రేష్టుడైన దేవుడు లేడు. గాయత్రిని మించిన శ్రేష్టమైన మంత్రం నేటి వరకు లేదు. ముందురాదు. సమస్త వేదాల సారమూ-ఉపనిషత్తులూ అంటఉ పనిషత్సారమూ గాయత్రీ మంత్రమై యున్నది. నరక రూప సాగరంలో మునిగిపోయే వారికి చేయూత నిచ్చి సంరక్షించునది గాయత్రీయే దీనిని మించిన శ్రేష్ఠశక్తి స్వర్గ, మర్త్య లోకాలలో ఎక్కడా లేదు.

**4) పరాశరులవారి కథనము :-**

సమస్త జప, సూక్త, వేద మంత్రాలలో గాయత్రీ మంత్రమే పరమ శ్రేష్ఠమైనది.

**5) శౌనకుని అభిప్రాయము :-**

ద్విజులు ఇతరేతరోపాసనలు చేసినా చేయకపోయినా, కేవలం గాయత్రీ జప మంత్రంచే బంధన ముక్తులౌతారు. భౌతిక, పారలౌకిక సుఖాలను పొందుతారు.

### 6) గాయత్రీ మంత్రసిద్ధి పొందిన వశిష్టుని వచనాలు :-

మందమతి,దుర్మార్గగామి, అస్థిరబుద్ధి కలవాడు కూడా గాయత్రీ ప్రభావము వలన సర్వోన్నత పదవిని పొందగలడు. సద్గతిని అవశ్య భావ్యంగా అందుకుంటాడు. పవిత్రంగా స్థిరత్వంతో గాయత్రీని జపించుతూ ఉపాసించునట్టివాడు - ఆత్మబోధ - లాభాన్ని పొందుతాడు.

### 7) నారద దేవర్షి పలుకులు :-

గాయత్రీ భక్తి స్వరూపమే. భక్తి రూపమైన గాయత్రీ ఉన్న పవిత్ర స్థానంలో శ్రీమన్నారయణ భగవానుడు కూడా ఉంటాడనటంలో సందేహం ఏమాత్రం లేదు.

### 8) వేదవ్యాస మహర్షి :-

పుష్పసారం మధువైనట్లూ, క్షీరసారం ఘృతమైనట్లు, సమస్త వేదములసారమూ గాయత్రియై తేజరిల్లుచున్నది. సిద్ధిచేసిన గాయత్రీ మంత్రము కామధేను సదృశమైనది. గంగానది శారీరక పాపాలను ప్రక్షాళన చేస్తుంటే, గాయత్రీ రూపమైన బ్రహ్మగంగవల్ల ఆత్మయే పవిత్రమౌతుంది.

### 9) అత్రి మహర్షి అభిప్రాయము :-

ఆత్మను శోధించునట్టి పరమ మంత్రము గాయత్రీ. దాని ప్రతాపము వలన కఠినతలు, దోష, దుర్గుణాలు ప్రక్షాలనమైపోతాయి. గాయత్రీ తత్వాన్ని చక్కగా గ్రహించగల్గునట్టి విద్వాంసులకు ఈ విశ్వంలో సుఖాలేవి శేషించి ఉండవు.

### 10) భరద్వాజ మహర్షి కథనము :-

బ్రహ్మ విష్ణు మహేశ్వరాది దేవతలు కూడా గాయత్రీ జపం చేస్తుంటారు. అది పరబ్రహ్మను సాక్షాత్కారం చేయిస్తుంది. అధర్మ కర్మలు చేయునట్టి వారి దుర్గుణాలన్నీ గాయత్రీ శక్తి కృపవల్ల దురమౌతాయి,

**11) చరకసంహిత రచయిత ఆచార్యచరకుల అభిమతము :-**

బ్రహ్మచర్యవ్రతపూర్వకముగా గాయత్రీనుపాసించు నట్టివాడు, చైత్రామలకాలను సేవించువాడు దీర్ఘజీవి అవుతాడు.

**12) అథర్వణ వేద వచనాలు :-**

గాయత్రీ మంత్రం ఆయుర్దాయాన్ని - ప్రాణశక్తి, కీర్తిసాధన, బ్రహ్మతేజస్సులను ప్రసాదించును.

ఇదే విధముగా సమాన, సమాదర భావాలను వ్యక్తం చేస్తూ ఈ ప్రసంగంలో ధార్మిక గ్రంథాలు అన్నీ ఉన్నాయి. ఋషులూ, మునులూ, తపస్వులూ, ఆచార్యులూ, బ్రాహ్మణులూ, విద్వాంసులూ, ఏకాభిప్రాయంతో గాయత్రీ మంత్రంలో అనేకానేక గుప్త అలౌకిక శక్తులను గూఢ రహస్యాలను, జ్ఞానాన్ని, వివేకాక్షయ భాండాగారాదులను గురించి ముక్తకంఠంతో ప్రశంసించి, గుణగానం చేసారు. అందువల్ల గాయత్రీ మంత్రం శ్రేష్ఠతరమైనదనీ, మహత్త్వ పూర్ణమైనదనీ, అనడంలో సందేహం ఎంతమాత్రం లేదు. అయితే..

కేవలం ప్రాచీన కాలంలోని గ్రంథాలు, ఋషులే కాకుండా ఆధునికకాలంలో కూడా అసంఖ్యాకులైన ఎందరో మహాపురుషులు, మహాత్ములు కూడా ఈ గాయత్రీ మంత్రమహిమపై స్వాభిప్రాయాలను వ్యక్తం చేసారు. అందులో కొన్నింటిని మాత్రం ఇక్కడ పొందుపరుస్తున్నాము.

**13) జగద్గురు శంకరాచార్యుల వారు :-**

గాయత్రీ మహిమను అభివర్ణించి పోల్చజాలము. సమృద్ధి కలిగి యుండటమంటే ఏ బుద్ధివల్ల ఆత్మప్రాప్తికి సంబంధించిన దివ్యదృష్టి కలుగుతుందో దానిని కలిగి ఉండటం -అది గాయత్రీ ద్వారానే లభిస్తుంది. గాయత్రీ మంత్రము దుష్టులను సంహరించడానికి, శిష్ట జనులను సంరక్షించడానికియే అవతరించింది.

**14) స్వామి రామకృష్ణ పరమహంస :-**

దీర్ఘసాధనలను విడనాడి గాయత్రీ సాధనచేసి చూడమనీ, దీని వలన మహత్తర సిద్ధులు లభిస్తాయనీ నేను ప్రజలకు చెబుతుంటాను. ఈ మంత్రం చిన్నదైనా, దీని శక్తిమాత్రం మహత్తరమైనది.

## 15) రామతీర్థస్వామి :-

రాముణ్ణి పొందడమే ఈ జీవితంలో మహత్తర కార్యం. గాయత్రీ మనుష్య మాత్రుణ్ణి కామరుచి నుండి తొలగించి, రామరుచిలో లగ్నం చేస్తుంది. పవిత్రాంతఃకరణ గలవాడు రామున్ని పొందగలుగుతాడు. గాయత్రీని అనుష్ఠించడం వలన కాముని కంటే రాముడు సర్వశ్రేష్టుడని భావం స్థిరమౌతుంది.

## 16) వివేకానందస్వామి :-

మహారాజైనవాణ్ణి, అతని గౌరవానికి అనుకూలమైన వస్తువునే యాచించాలి. పరమాత్మను అర్థించవలసిన వస్తువు సమృద్ధి, భగవంతుడు వేనియందు ప్రసన్నుడై యుంటాడో అట్టివానికి సమృద్ధిని ప్రసాదిస్తాడు. సమృద్ధి వల్ల సన్మార్గంలో ప్రగతి కలుగుతుంది. సత్కర్మలవల్ల సర్వసుఖాలు లభిస్తాయి. సత్-అంటే దైవం వైపు పురోగమించే వారికి ఎట్టి సుఖాలకు లోటు ఉండదు. గాయత్రీ మంత్రం -సమృద్ధి మంత్రము. అందులకే దానికి మంత్రమకుటమని ఖ్యాతి వచ్చింది.

## 17) రమణ మహర్షి :-

యోగ విద్యాంతర్గతమైన మంత్రవిద్య - మహత్తర ప్రబలమైనది. మంత్రశక్తి వల్ల అద్భుతఫలాలు చేకూరుతాయి. ఐహిక లౌకిక సుఖాలు రెండూ గాయత్రీ మంత్రం వల్ల లభిస్తాయి.

## 18) స్వామి శివానంద :-

బ్రహ్మ ముహూర్తంలో గాయత్రీని జపించడం వల్ల చిత్తశుద్ధి కలుగుతుంది, హృదయం నిర్మలంగాను, శరీరం ఆరోగ్యంగానూ ఉంటుంది. స్వభావంలో నమ్రత్వం ఏర్పడుతుంది. బుద్ధి సూక్ష్మం కావడం వల్ల దూరదృష్టి కలిగి ధారణశక్తి వర్ధిల్లుతుంది. కఠిన పరిస్థితులలో గాయత్రీ ద్వారా సహకారం లభిస్తుంది. తద్వారా ఆత్మదర్శనం కలుగుతుంది.

## 19) శ్రీకరపాత్ర స్వామిజీ :-

గాయత్రీ అధికారం కలవారు నిత్యం నియమ పూర్వకంగా జపం చెయ్యాలి. ద్విజులు గాయత్రీని ఉపాసించడం అత్యంతావశ్యకము.

## 20) శ్రీ పర్వతానంద స్వామీ :-

గాయత్రీ మంత్రం ద్వారానే ఆర్యులు ఆది నుండి పరమాత్మోపాసన చేస్తున్నారు. దయానందులవారు కూడా ఆ సంప్రదాయాన్నే అనుసరించి సంధ్యావిధాన, వేదస్వాధ్యాయనం చెయ్యాలని చెప్పారు. అలా చెయ్యడం వల్ల అంతఃకరణ శుద్ధమై బుద్ధి నిర్మలమై - మానవ జీవితం తనకూ, పరులకూ, హితకరమౌతుంది. ఈ విషయంలో శ్రద్ధా విశేషాలు వర్ధిల్లేకొద్దీ అవిశ్వాసాది క్లేశాలు నాశనమౌతాయి. గాయత్రీ మంత్రాన్ని నియమ పూర్వకంగా ప్రేమతో జపించు జిజ్ఞాసువులకు - అది సంసారసాగర తరణానికి నౌకయై ఆత్మప్రాప్తి  మార్గం కాగలదు.

## 21) ఆర్య సమాజ స్థాపకులు శ్రీ దయానందస్వామి :-

గాయత్రీ మంత్రం సర్వోత్కృష్ట  శ్రేష్ఠ మంత్రము. చతుర్వేదాలకూ మూలమైన గురుమంత్రమిదియే ఆదికాలం నుండి ఋషులూ, మునులూ అందరూ దీనినే జపించేవారు.

## 22) కాలీ కమలేవాలే బాబా విశుద్ధానందజీ :-

గాయత్రీ మంత్రం అంటే ఆదిలోనే అభిరుచి కలిగేదికాదు. దైవకృపవల్ల అభిరుచి ఏర్పడితే అట్టివాడు దుర్మార్గగామి కాజాలడు. గాయత్రీని జపించునట్టి హృదయం భగవంతునివైపు మాత్రమే పురోగమిస్తుంది. విషయ వికారాల వ్యర్థత్వం అతనికి చక్కగా అనుభవంలోకి వస్తుంది. ఎందరో మహాత్ములు గాయత్రీని జపించి పరమసిద్ధిని పొందారు. పరమాత్మశక్తియే గాయత్రీ. గాయత్రి సన్నిధికి చేరువాడు శుద్ధుడౌతాడు. ఆత్మ కళ్యాణార్థం మనస్సు శుద్ధంగా ఉండడం అత్యంతావశ్యకంకాగా, ఆ మనశ్శుద్ధికి గాయత్రీ మంత్రం మాత్రమే అత్యద్భుతంగా పనిచేస్తుంది. భగవత్ ప్రాప్తికి ఈ గాయత్రీ మంత్రానుష్ఠానమే ప్రథమ సోపానమని గ్రహించెదరుగాక.

## 23) శ్రీ విద్యానంద స్వాముల వారు :-

గాయత్రీ బుద్ధిని పవిత్రం చేస్తుంది. బుద్ధి పవిత్రం ఉండటం కంటే జీవితంలో వేరే లాభమేదీ లేదు. కనుక గాయత్రీ దివ్యశక్తి ఓ మహత్తర లాభాన్ని ప్రసాదించునదై తేజరిల్లుతుంది.

## 24) యోగి అరవింద్ ఘోష్ :-

గాయత్రీలో సన్నిహితమై యున్న శక్తి మహత్తరపూర్వ కార్యాన్ని సాధిస్తుంది. (వీరనేకమందికి సాధనామార్గాలలో గాయత్రీ మంత్రోపదేశం చేస్తారు)

## 25) కవివరులు రవీంద్రనాథ్ ఠాగూర్ :-

ఒకే ఒక శ్వాసలో సరళంగా ఉచ్చారణ చేయగల గాయత్రీ మంత్రం ద్వారా భారతదేశం మొత్తాన్నే జాగృతం చేయవచ్చును. ఈ పవిత్ర మంత్ర సాధనలో ఏ విధమైన తార్కిక అపోహలు, మతభేదాలు అవసరం లేదు.

## 26) లోకమాన్య బాలగంగాధర్ తిలక్ :-

అనేక విధాలైన దాసత్వ శృంఖాలలో బంధింపబడిన భారతీయ ప్రజలు విముక్తి పొందాలంటే రాజకీయ, నైతిక సంఘర్షణల వల్ల జరుగదు. దానికై ఆత్మలో ప్రకాశాన్ని కలిగింప చెయ్యాలి. తద్వారా సదసద్వివేకం కలుగుతుంది. దుర్మార్గం నుండి శ్రేష్ఠమార్గం మీద పురోగమించాలన్న ప్రేరణ కలుగుతుంది. ఈ భావనయే గాయత్రీ మంత్రంలో విద్యమానమై ఉంది.

## 27) గాంధీ మహాత్ముడు :-

నిరంతరం గాయత్రీ మంత్రాన్ని అనుష్ఠించడం వలన రోగాలను నయం చేయడం జరుగుతుంది. ఆత్మోన్నతికి సహకరిస్తుంది. స్థిరమై, శాంతమైన చిత్తంతో గాయత్రీ మంత్రానుష్ఠానం చేయడం వల్ల - అది ఆపదలను, సంకటాలను దూరం చేయగల ప్రభావం కలిగియుంటుంది.

## 28) శ్రీమదన్ మోహన్ మాలవ్యా :-

ఋషులు మనకు ప్రసాదించిన రత్నాలలో గాయత్రీ మంత్రం అనుపమానమైన దివ్యరత్నము. గాయత్రీ వల్ల బుద్ధి పవిత్రమౌతుంది. ఆత్మలో పరమాత్మ ప్రకాశం కలుగుతుంది. గాయత్రీలో - ఈశ్వర పరాయణత్వ భావాలను ఉత్పన్నం చేసే దివ్యశక్తి ఉంది.

## 29) డా॥ సర్వేపల్లి రాధాకృష్ణ :-

ఈ సార్వభౌమిక ప్రార్థనయైన గాయత్రీపై మనం విచారణ సాగించినట్లయితే, దీనివల్ల ఎంత లాభం కలుగుతుందో తెలుస్తుంది. మనలో పునఃజీవన స్రోతస్సును ప్రభావింపజేయగల ప్రార్థనయే గాయత్రీ ప్రార్థన.

## 30) ప్రసిద్ధ ఆత్మజ్ఞాని శ్రీ టి. సుబ్బారావు :-

సవితానారాయణుని దైవీప్రకృతిని గాయత్రీ అంటారు. ఆదిశక్తి కావడం వల్ల ఇది గాయత్రీ అనబడుతున్నది. ఆదిత్య వర్ణన-అని భగవద్గీతలో వర్ణన చేయబడి ఉన్నది. గాయత్రిని ఉపాసన చేయడం యోగాభ్యాసంలో సర్వ ప్రథమాంగమై ఉంది.

ఇదే విధముగా ఆధునిక యుగంలో అనేకానేకులైన విద్వాంసులు ఉపాసకులు కూడా గాయత్రీ మంత్ర మహిమపై ఏకగ్రీవాంగీకారాన్ని తెలియజేసారు. దీనివల్ల గాయత్రీ – వాస్తవానికి ఓ అద్భుతశక్తి స్రోతస్సు, లేదా, సాధన అయింది. గాయత్రీ మంత్రం సర్వ శ్రేష్ఠ మంత్రమై తేజరిల్లుతుంది.

అందువల్ల ఇంత శక్తివంతమైన గాయత్రీ మహా మంత్ర సిద్ధి కొరకు వారి వారి వీలును అనుసరించి పునశ్చరణ చేసినచో ఐహిక లౌకిక సుఖాలు రెండు పొందగలరు, అనుటలో ఎలాంటి సందేహము లేదు.

## గాయత్రీ మహా మంత్ర పునశ్చరణ చేయటానికి పాటించవలసిన నియమాలు

1) ముందుగా తమ సద్గురువు అనుమతి తీసుకొని శుభ ముహూర్తము చూసి ప్రారంభించాలి. చాతుర్మాసములందు ప్రారంభము చేయకూడదు.

2) పునశ్చరణ ప్రారంభానికి ముందు పరిశీలన కొరకు కనీసం ఒక లక్ష గాయత్రీ మంత్ర జపము చేయవలెను. తర్వాతనే పునశ్చరణ ప్రారంభించవలెను.

3) పరిశీలన జపం తర్వాత నదీస్నానము, వపనము, కుల, ఇష్ట దేవత దర్శనము చేయాలి.

4) ప్రతీరోజు బ్రాహ్మీముహూర్తంలోనే లేచి కాలకృత్యాలు, స్నానసంధ్యాదికాలు ముగించాలి.రెండు పూటల చన్నీటి స్నానమే చేయాలి. (అశక్తులకు మినహాయింపు) స్నానపు నీటిలో గంగాజలాన్ని కలుపుకొని గంగానదిలో స్నానము ఆచరిస్తున్నట్లుభావించాలి.

5) తప్పకుండా సకాలంలో త్రికాల సంధ్యావందనము ఆచరించాలి.

6) పునశ్చరణ రోజులలో అఖండ దీపము, ఆవునెయ్యి లేదా నువ్వులనూనెతో వెలిగించాలి.

7) ఒంటి పూట మాత్రమే భోజనము చెయ్యాలి. సాత్విక ఆహారము మాత్రమే తీసుకోవాలి.

8) బ్రహ్మచర్యము పాటిస్తూ భూశయనమే చేయాలి.

9) సంకల్పిత జప సంఖ్య మొత్తము ఒకే ఆసనముపై మధ్యాహ్నము 12.30 గం॥లోపే సమాప్తముఅయ్యేట్లు చూసుకోవాలి.జపము మధ్యలో ఏమిసేవించకూడదు. మధ్యలో లేవకూడదు. అందుకు తగిన జాగ్రత్తలు తీసుకోవాలి.

10) పూర్తి మౌనాన్ని పాటించగలిగితే చాలా మంచిది. లేదంటే కనీసము రోజు కార్యక్రమము అయ్యేవరకు మౌనాన్ని పాటించాలి.

**"యేతు సంవత్సరం పూర్ణం నిత్యం మౌనేన భుంజతే ।
యుగ కోటి సహస్రం వే పూజ్యం తే స్వర్గ విష్టపే ॥**

ఒక సంవత్సరము భోజనము చేసేటపుడు మాత్రమే మౌనంగా ఉంటే వేయికోటి యుగాలు స్వర్గంలో పూజింపబడతాడు. ఇక పూర్తి మౌనము పాటిస్తూ పునశ్చరణ చేస్తే దాని ఫలితము ఊహకు అందదు.

11) ధూమపానము, కిళ్ళీ, గుట్కా లాంటివి ఏమీ సేవించకూడదు.

12) కత్తిరించికుట్టించిన బట్టలు వేసుకోకూడదు. పాదరక్షలు వాడకూడదు

13) వెంట్రుకలు (కటింగ్, షేవింగ్) మరియు గోళ్ళు తీయరాదు.

14) ప్రతీరోజు ఒకే సంఖ్య జపము చేయాలి. హెచ్చుతగ్గులు చేయరాదు.

15) వీలుంటే ఇతర పనులను మానుకొని ఊరి పొలిమేర దాటకుండా ఉండగలిగితే మంచిది. తీరిక సమయాన్ని పురాణ (రామాయణ, భారత, భాగవత మొ॥) పారాయణం చేయుటమంచిది.

16) వీలున్నంత వరకు టి.వి కి దూరంగా ఉంటే మంచిది. భక్తి,ధార్మిక కార్యక్రమాలు తప్ప వేరేవి చూడకుండా ఉండటము మంచిది.

17) మూత్రవిసర్జన చేసి కాళ్ళు, చేతులు కడుక్కొని 4 మార్లు నీళ్ళు పుక్కిలించి ఉమ్మి వేయాలి.

18) సంకల్పము నందు ఆ రోజు గల తిథి, వార, నక్షత్ర, యోగ, కరణములను చెప్పి సంకల్పము చేయుట ఉత్తమము.

19) తమ సంప్రదాయములను అనుసరించి నుదురుపై భస్మము / గోపి చందనము, తిలకమును తప్పక ధరించవలెను. రుద్రాక్షమాల కానీ, తులసిమాల కానీ మెడలో ధరించవలెను.

20) జపము తర్వాత ప్రతీరోజు జప సంఖ్యలో దశాంశము తర్పణములు ఏ రోజుకు ఆ రోజే ఇయ్యవలెను. అందువలన జప, తర్పణాలు సమాంతరంగా జరుగును.

21) ఎల్లప్పుడూ ప్రశాంతంగా ఉండాలి. ఎలాంటి సందేహాలు లేకుండా పూర్తి నిష్ఠతో, భక్తి శ్రద్ధలతో, నమ్మకంతో నిర్వహించాలి.

22) వీలుంటే గోమాత సేవ చేయగలిగితే మంచిది. మరియు గాయత్రీ సహస్ర నామ లేదా అష్టోత్తర శతనామ పారాయణము ప్రతీరోజు జప తర్పణముల తర్వాత చేయాలి.

23) ప్రతీరోజు జప తర్పణముల తర్వాత ఆ రోజటి ప్రారంభ, సమాప్త సమయములను లిఖించుకొనుట మంచిది. (జతచేసిన పట్టికను అనుసరించి) సంకల్పమునకు కూడా ఉపయోగము.

24) పునశ్చరణ జప సంఖ్య24 లక్షలు, తర్పణాలు 2 లక్షల 40 వేలు పూర్తి అయిన తర్వాత కనీసము లక్ష గాయత్రి మహా మంత్ర జపమును లోపదోష ప్రాయశ్చిత్తార్థము చేయాలి.
మొత్తము కార్యక్రమము హోమము, బ్రాహ్మణ భోజనము, అన్నదానము మొదలగు కార్యక్రమాలు యైన పిదప దైవక్షేత్రంలో ఒక నిద్ర, వపనము, నదీస్నానము, కుల, ఇష్ట దేవతా దర్శనము చేసుకోవాలి.అంతటితో గాయత్రీ మహామంత్ర పునశ్చరణ పూర్తి అగును.

## ఇది ఉత్తమోత్తమమైన పునశ్చరణ విధానము..

పై విధంగా వీలు కానీ పక్షంలో మామూలు నియమాలు పాటిస్తూ తమ రోజువారి కార్యక్రమాలు నిర్వహిస్తూ కూడా పునశ్చరణ చేయవచ్చును.ప్రతీరోజు తమ వీలుని బట్టి నియమిత సంఖ్య కనీసము సహస్ర గాయత్రీ చేసి పునశ్చరణ చేయువచ్చును.

**" క్షత్రియో బాహువీర్యేణ తరేదాపద ఆత్మనః ।**
**ధనేన వైశ్యః శూద్రశ్చ జప హోమైర్ద్విజోత్తమః ॥**

క్షత్రియులు బాహు శక్తితో, వైశ్య శూద్రులు ధనంతో బ్రాహ్మణులు జప హోమాదులతో ఆపదలనుండి గట్టెక్కుతారు.

## ప్రతిదినము కార్యక్రమ వివరాలు లిఖించుకొను పట్టిక

| క్రమసంఖ్య | మాసముతిథి | వారము | నక్షత్రము | యోగము | కరణము | ఆంగ్లతేది | ప్రారంభసమయము | సమాప్తసమయము |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 |

గాయత్రీ పునశ్చరణ ప్రారంభానికి ముందు మరియు మొత్తము కార్యక్రమ పరిసమాప్తి తర్వాత వపనము ఆచరించాలి.

ఆచమ్య......................ప్రాణానాయమ్య............శుభథితౌ

మమ గాయత్రీ పునశ్చరణ అంగభూతం

మమ గాయత్రీ పునశ్చరణ పరిసమాప్త అంగ

భూతంవపనం కరిష్యే

యానికానిచ పాపాని బ్రహ్మహత్య సమానిచ

కేశానాశ్రిత్య తిష్ఠంతి తస్మాత్ కేశాన్ వపామ్యహం ॥

అనుచూ 3 ప్రదక్షిణలు చేయాలి. వపనానికి ఆజ్ఞా తూర్పు దిశకు ముఖము చేసి కూర్చుని వపనము చేసుకోవాలి. తదుపరి నదీస్నానము ఆచరించాలి.



## గాయత్రీ పునశ్చరణ ప్రయోగము

ఈ విధివిధానము ధర్మ సింధువులో నుండి గ్రహింపబడినది. మరియు దీనికి మూలము అనంత దేవీయ గ్రంథములు.

## గాగాయత్రీ పునశ్చరణ ప్రయోగము

ఈ విధివిధానము ధర్మ సింధువులో నుండి గ్రహింపబడినది. మరియు దీనికి మూలము అనంత దేవీయ గ్రంథములు.

గాయత్రీ మంత్ర పునశ్చరణ దినములందు యజమాని శివ సంకల్ప మంత్రమును ముమ్మారు పఠించవలెను.

ఆచమ్య ప్రాణానాయమ్య
కేశవాయస్వాహా..................శ్రీ కృష్ణ పరమాత్మనే నమః
ఓం భూః...........................ధియో యోనః ప్రచోదయాత్

## దేశకాల సంకీర్తన పూర్వక సంకల్పము

శుభాభ్యుదయార్థంచ ....................................శుభతిథౌ
శ్రీమాన్ .....................గోత్ర.......................నామధేయఃమయా కరిష్యమాణ గాయత్రీ పునశ్చరణాధికార సిద్ధ్యర్థం కృచ్ఛత్రయేన / అముక ప్రత్యామ్నా యేన ఆహమాచరిష్యే ॥

## బ్రాహ్మణ నమస్కారము

కాంస్య పాత్రే తండుల తాంబూల హిరణ్యాధికం గృహీత్వా ।
(ఉపనయన ప్రయోగము)

ఈ జపము పునశ్చరణ సంకల్పించిన విప్రుడు స్వయముగా చేయువలెను.

ప్రణవ వ్యాహృతులతో గూడిన ఈ గాయత్రీ మంత్రమును పదివేలు (10,000) జపించవలెను.



ఓం భూర్భువ స్వః తత్సవితుర్వరేణ్యం

ఇట్లు జపము పూర్తియైన తరువాత ఈ దిగువ మంత్రములను ఒక్కొక్కటి పది పర్యాయములు స్వయముగానైనా, బ్రాహ్మణుల ద్వారాగానీ సాధకుని మార్జన చేయవలెను.

ఓం ఆపోహిష్ఠామయోభువః తానఊర్జేదధాతన । మహేరణాయ చక్షసే। యోవశ్శివతమో రసః । తస్య భాజయుతే హనః । ఉశతీరివ మాతరః । తస్మా అరంగ మామవః యస్యక్షయాయ జన్వథ ।ఆపోజనయథాచనః

(10)

1) ఏతోన్విన్ద్రగ్‌స్తవాయ శుద్ధం శుద్ధేన సామ్నా ।
శుద్ధైరుక్థైర్వా వృధ్వాంసం శుద్ధ ఆశీర్వాన్మమత్తు (10)

2) ఇన్ద్రశుద్దోన ఆగహి । శుద్ధే శుద్ధాబిరూతిభి ః ।

3) శుద్దోరయిం నిదారయ । శుద్దో మమద్ది సోమ్యా ః । (10)

4) ఇన్ద్ర శుద్ధోహినో రయిగ్ం శుద్ధోరత్నాని చాశుషే ।
శుద్దోవృత్రాణి జఘ్నన్ । శుద్దోవాజగ్ం సిషాసనిసి ॥ (10)

(5) అఘమర్షణ సూక్తంతో (10)

(6) పవమాన సూక్తమ్ (1)

## అఘమర్షణసూక్తమ్

హిరణ్యశృఙ్గం వరుణం ప్రపద్యే తీర్థం మే దేహి యాచితః । యన్మయా భుక్తమసాధూనాం పాపేభ్యశ్చ ప్రతిగ్రహః। యన్మే మనసా వాచా కర్మణా వా దుష్కృతం కృతమ్ । తన్న ఇన్ద్రో వరుణో బృహస్పతి స్సవితా చ పునన్తు పునః పునః । నమోఽగ్నయేఽప్సుమతే నమ ఇన్ద్రాయ నమో వరుణాయ నమో వారుణ్యై నమోఽద్భ్యః ॥

యదపాం క్రూరం యదమేధ్యం యదశాన్తం తదపగచ్ఛతాత్ । అత్యాశనాదతీపానాద్యచ్చ ఉగ్రాత్ ప్రతిగ్రహాత్ । తన్నో వరుణో రాజా పాణినాహ్యవమర్శతు । సోఽహమపాపో విరజో నిర్ముక్తో ముక్తకిల్బిషః । నాకస్య పృష్ఠమారుహ్య గచ్ఛేద్బ్రహ్మసలోకతామ్ । యశ్చాప్సు వరుణస్స పునాత్వఘమర్షణః । ఇమం మే గంగే యమునే సరస్వతి శుతద్రి-స్తోమగ్ం సచతా పరుష్ణియా । అసిక్నియా మరుద్వృధే వితస్తయాఽఽర్జీకీయే శృణుహ్యా సుషోమయా । ఋతం చ సత్యం చాభీద్ధా త్తపసోఽధ్యజాయత । తతో రాత్రిరజాయత తతస్సముద్రో అర్ణవః ।

సముద్రాదర్ణవా దధి సంవత్సరో అజాయత । అహోరాత్రాణి విదధద్విశ్వస్య మిషతో వశీ । సూర్యాచంద్రమసౌ ధాతా యథాపూర్వ

మకల్పయత్ । దివం చ పృథివీం చాన్తరిక్షమథో సువః । యత్పృథివాగ్ం రజస్స్వమాన్తరిక్షే విరోదసీ । ఇమాగ్ స్తదాపో వరుణః పునాత్వఘమర్షణః । పునన్తు వసవః పునాతు వరుణః పునాత్వఘమర్షణః । ఏష భూతస్య మధ్యే భువనస్య గోప్తా । ఏష పుణ్యకృతాం లోకానేష మృత్యోర్ హిరణ్మయమ్ । ద్యావాపృథివ్యోర్హిరణ్యమయగ్ం సగ్గ్ శ్రితగ్ం సువః ॥

సనస్సువస్సగ్ంశిశాధి । ఆర్ద్రం జ్వలతి జ్యోతిరహమస్మి । జ్యోతి ర్జ్వలతి బ్రహ్మాహమస్మి । యోఽహమస్మి బ్రహ్మాహమస్మి । అహమస్మి బ్రహ్మాహమస్మి । అహమేవాహం మాం జుహోమి స్వాహా । అకార్యకార్య వకీర్ణీ స్తేనో భ్రూణహా గురుతల్పగః । వరుణోఽపామఘమర్షణస్తస్మాత్ పాపాత్ప్రముచ్యతే । రజోభూమిస్త్వమాగ్ంరోదయస్వ ప్రవదన్తి ధీరాః ఆక్రాన్త్సముద్రః ప్రథమే విధర్మంజనయన్ప్రజా భువనస్య రాజా । వృషా పవిత్రే అధిసానో అవ్యే బృహత్సోమో వావృధే సువాన ఇన్దుః ॥

**ఇతి అఘమర్షణ సూక్తం సమాప్తమ్....!**

# పవమానసూక్తమ్

తై. సంహితా - కాండమ్ - 5, ప్రపాఠకః 6, అను - 1

తై. బ్రాహ్మణమ్ - అష్టకమ్ - 1, ప్రశ్నః 4, అను - 8

ఓం ॥ హిరణ్యవర్ణాః శుచయః పావకా యాసు జాతః కశ్యపో యాస్వింద్రః। అగ్నిం యా గర్భం దధిరే విరూపాస్తాన ఆపశ్శగ్గ్ స్యోనా భవంతు ॥ యాసాగ్ం రాజా వరుణో యాతి మధ్యే సత్యానృతే అవపశ్యం జనానామ్ । మధుశ్చుతశ్శుచయో యాః పావకాస్తా న ఆపశ్శగ్గ్ స్యోనా భవంతు ॥ యాసాం దేవా దివి కృణ్వంతి భక్షం యా అంతరిక్షే బహుధా భవంతి । యాః పృథివీం పయసోందంతి శుక్రాస్తా న ఆపశ్శగ్గ్ స్యోనా భవంతు ॥ శివేన మా చక్షుషా పశ్యతాపశ్శివయా తనువోప స్పృశత త్వచం మే । సర్వాగ్ం అగ్నీగ్ం రప్సుషదో హువే వో మయి వర్చో బలమోజో నిధత్త ॥ పవమానస్సువర్జనః । పవిత్రేణ విచర్షణిః । యః పోతా స పునాతు మా । పునంతు మా దేవజనాః । పునంతు మనవో ధియా । పునంతు విశ్వ ఆయవః । జాతవేద : పవిత్రవత్ । పవిత్రేణ పునాహి మా । శుక్రేణ దేవదీద్యత్ । అగ్నే క్రత్వా క్రతూగ్ం రను । యత్తే పవిత్రమర్చిషి । అగ్నే వితతమంతరా । బ్రహ్మ తేన పునీమహే । ఉభాభ్యాం దేవసవితః । పవిత్రేణ సవేన చ । ఇదం బ్రహ్మ పునీమహే । వైశ్వదేవీ పునతీ దేవ్యాగాత్ । యస్యై బహ్వీస్తనువో వీతపృష్ఠాః । తయా మదంతః సధమాద్యేషు । వయగ్గ్ స్యామ పతయో రయీణామ్ । వైశ్వానరో రశ్మిభిర్మా పునాతు । వాతః ప్రాణేనేషిరో మయో భూః । ద్యావాపృథివీ పయసా పయోభిః । ఋతావరీ యజ్ఞియే మా పునీతామ్ ।

బృహద్భిః సవితస్తృభిః । వర్షిష్ఠైర్దేవమన్మభిః । అగ్నే దక్షైః పునాహి మా
యేన దేవా అపునత । యేనాపో దివ్యంకశః । తేన దివ్యేన బ్రహ్మణా । ఇదం
బ్రహ్మ పునీమహే । యః పావమానీరధ్యేతి । ఋషిభిస్సంభృతగ్ం రసమ్ ।
సర్వగ్ం స పూతమశ్నాతి । స్వదితం మాతరిశ్వనా । పావమానీర్యో అధ్యేతి ।
ఋషిభిస్సంభృతగ్ం రసమ్ । తస్మై సరస్వతీ దుహే । క్షీరగ్ం సర్పిర్మధూదకమ్।
పావమానీస్స్వస్త్యయనీః । సుదుఘాహి పయస్వతీః । ఋషిభిస్సంభృతో రసః।
బ్రాహ్మణేష్వమృతగ్ం హితమ్ । పావమానీర్దిశంతు నః । ఇమం లోకమథో
అముమ్ । కామాన్థ్సమర్ధయంతు నః । దేవీర్దేవైః సమాభృతాః ।
పావమానీస్స్వస్త్యయనీః । సుదుఘాహి ఘృతశ్చుతః । ఋషిభిః సంభృతో
రసః । బ్రాహ్మణేష్వమృతగ్ం హితమ్। యేన దేవాః పవిత్రేణ । ఆత్మానం
పునతే సదా । తేన సహస్రధారేణ । పావమాన్యః పునంతు మా। ప్రాజాపత్యం
పవిత్రమ్ । శతోద్యామగ్ం హిరణ్మయమ్ । తేన బ్రహ్మ విదో వయమ్ ।
పూతం బ్రహ్మ పునీమహే । ఇంద్రస్సునీతీ సహమా పునాతు । సోమస్స్వస్త్యా
వరుణస్సమీచ్యా । యమో రాజా ప్రమృణాభిః పునాతు మా । జాతవేదా
మోర్జయంత్యా పునాతు । భూర్భువస్సువః ॥

ఓం తచ్ఛం యోరావృణీమహే । గాతుం యజ్ఞాయ । గాతుం యజ్ఞ
పతయే। దైవీస్స్వస్తిరస్తు నః । స్వస్తిర్మానుషేభ్యః । ఊర్ధ్వం జిగాతు భేషజమ్।
శన్నో అస్తు ద్విపదే । శం చతుష్పదే । ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః ॥

ఇతి పవమానసూక్తమ్ సమాప్తమ్

## తర్పణములు

1) తత్సవితురిత్స స్యాచార్య మృషిం విశ్వామిత్రం తర్పయామి
2) గాయత్రీచ్ఛంద స్తర్పయామి
3) సవితారం దేవతాం తర్పయామి
కద్రుద్రాయ ప్రచేతసే మిడుష్టమాయ తప్యసే వో చేమ శన్తమగ్ం
హృదే । సర్వోహ్యేష రుద్రుస్తస్మై రుద్రాయ నమో అస్తు ॥

## ద్వితీయ దినకర్తవ్యము

హరిః ఓమ్
అపవిత్రః పవిత్రోవా సర్వావస్థాంగతోపివా ।
యః స్మరేత్ పుండరీకాక్షం సబాహ్యాభ్యన్తశ్శుచిః ॥
పుండరీకాక్ష । పుండరీకాక్ష ॥ పుండరీకాక్ష ॥।

## ఆచమనము

ఓం కేశవాయస్వాహా.....................................శ్రీకృష్ణాయనమః ॥

## భూతోచ్చాటనము

ఉత్తిష్ఠన్తు భూత పిశాచాః యేతే భూమి భారకాః ॥
ఏతేషా మవిరోధేన బ్రహ్మ కర్మ సమారభే ॥

## ఆసనవిధి

ఓం పృథివ్యాః । మేరు పృష్ఠఋషిః । కూర్మోదేవతా ।
సుతలం ఛందః । ఆసనే వినియోగ ః । అనంతాసనాయనమః ॥

## ప్రాణాయామము

ప్రణవస్య పరబ్రహ్మ ఋషిః । పరమాత్మాదేవతా ।
దైవీ గాయత్రీ ఛంద ః । ప్రాణాయామే వినియోగ ః ॥
ఓం భూ ః । ఓం భువ ః ఓం స్వః ఓం మహః ఓం జనః ఓం తపః ।
ఓం సత్యం ఓం తత్సవితుర్వరేణ్యం భర్గో దేవస్య ధీమహి
ధియో యోనః ప్రచోదయాత్ । ఓమాపోజ్యోతీరసోమృతం
బ్రహ్మ భూర్భువస్సురోమ్ ॥

## దేశకాల సంకీర్తన పూర్వక సంకల్పము

శుభాభ్యుదయార్థంచ.............................శుభతిథౌ

మమ సకల పాపక్షయద్వారా శ్రీ పరమేశ్వర ప్రీత్యర్థం

"చతుర్వింశతిలక్షాత్మక" గాయత్రీ పునశ్చరణ అహం కరిష్యే ॥

అని సంకల్పించి తదంగముగా విఘ్నేశ్వర పూజ,

స్వస్తి పుణ్యాహవాచనము మాతృకాపూజ,

నాంథీశ్రాద్ధము సంకల్పించవలెను.

నాంథీ శ్రాద్ధఅంతమందు "సవితాప్రియతాం అని నీళ్ళు వదలవలెను.

## సర్వదేవతా ప్రార్థన

సోమః సూర్యో యమః కాలసంధ్యే భూతాన్యహా ః

క్షపా పవనోదిక్కృతిర్భూమిరాకాశం ఖేచరా మరా ః

బ్రహ్మా శాసన మా స్థాయ కల్పధ్వమిహా ॥

గురవే నమః గణపతయే నమః దుర్గాయైనమః

కులదేవతాయైనమః ఇష్టదేవతాయైనమః మాతృభ్యోనమః

పితృభ్యోనమః శ్రీ మన్మహా గాయత్రీ దేవతాభ్యోనమః

# మాలా సంస్కారము

ఓం అం ఆం మొదలు హం ళం క్షం వరకు అన్ని వర్ణములను ఉచ్ఛరించి పంచగవ్యప్రోక్షణ చేసి ఈ క్రింది మంత్రములతో మంచి నీటితో శుద్ధి చేయవలెను.

**ఓం సద్యోజాతం ప్రపద్యామి సద్యోజాతాయవై నమోనమః**
**భవే భవే నాతి భవే భవస్వ మాం భవోధ్భవాయ నమః**
**వామ దేవాయ నమో జ్యేష్ఠాయ నమః శ్రేష్ఠాయ నమో రుద్రాయ నమః**
**కాలాయ నమః కలవికరణాయ నమో బలవికరణాయ నమో**
**బలాయనమో బలప్రమథనాయ నమస్సర్వ భూతదమనాయ నమో**
**మనోన్మనాయ నమః**

**ఓం అఘోరేభ్యోదఘోరేభ్యోఘోరఘోరతరేభ్యః**
**సర్వేభ్యః సర్వశర్వేభ్యో నమస్తే అస్తు రుద్రరూపేభ్యః**
**ఓం తత్పురుషాయ విద్మహే మహా దేవాయ ధీమహి**
**తన్నో రుద్రః ప్రచోదయాత్ ॥**

తర్వాత ఈ క్రింది మంత్రముతో ఒక్కొక్క గింజపై కనీసం ఒకసారి జపించవలెను.

**"ఓం ఈశానస్సర్వ విద్యానామీశ్వర స్సర్వ భూతానాం బ్రహ్మోధిపతి ర్బ్రహ్మనోధిపతిర్బ్రహ్మ శివోమే అస్తు సదాశివోమ్ "**

తర్వాత మాలను యధావిధిగా ఇష్టదేవతా ప్రాణ ప్రతిష్ఠ చేసి ఇష్టదేవతా మంత్రముతో పూజించవలెను. తర్వాత లమిత్యాది పంచపూజ చేయవలెను.

ఓం లం పృథ్వీ తత్వాత్మనే నారాయణాయ గంధం పరికల్పయామి
ఓం హం ఆకాశ తత్వాత్మనే వాసుదేవాయ పుష్పం పరికల్పయామి
ఓం యం వాయు తత్వాత్మనే సంకర్షణాయ ధూపం పరికల్పయామి
ఓం రం అగ్ని తత్వాత్మనే ప్రద్యుమ్నాయ దీపం పరికల్పయామి
ఓం వం అమృత తత్వాత్మనే అనిరుద్ధాయ నైవేద్యం పరికల్పయామి
ఓం సం సర్వ తత్వాత్మనే సర్వోపచార పూజాం పరికల్పయామి

పై విధముగా సంస్కరించబడిన మాలతో ప్రతి నిత్యము హృదయాది అంగన్యాస కరన్యాసములు చేసి మంత్రదేవతాయైన సవితను ధ్యానించి హృదయము నందు మాలను పట్టుకుని మధ్యాహ్నము వరకు జపించవలెను.

జప అంతమున ప్రణవముచ్చరించి ముమ్మారు ప్రాణాయామము చేసి జపమును ఈశ్వరునికి అర్పించవలెను.

ప్రతి దినము సమాన సంఖ్యయే జపము చేయవలెను. న్యూనాధికము కూడదు.

ఇట్లు పునశ్చరణ జపము తర్పణము అంతయు సంపూర్ణమైన తదుపరి హోమము చేయవలెను.

" హోమము, సవితాదేవి తర్పణము. ఆత్మాభిషేకము ఏది సంభవించకుండునో దాని స్థానమందు దాని సంఖ్యకు ద్విగుణముగా గాయత్రీ మహామంత్ర జపము చేయవలెను. (10 రోజులు 6 వేలు చొప్పున జపము చేసినచో పైమూడింటి మొత్తానికి సరిపోతుంది.)

# సంపూర్ణ గాయత్రీ మహామంత్ర పునశ్చరణ విధానము

| | | |
|---|---|---|
| 1) | గాయత్రీ మహామంత్ర జపము | 24,00,000 |
| 2) | గాయత్రీ మహామంత్ర తర్పణము | 2,40,000 |
| 3) | గాయత్రీ మహామంత్ర హోమము | 24,000 |
| 4) | గాయత్రీ హోమాంతమున సవితృదేవి తర్పణము "సవితారం తర్పయామి " | 2,400 |
| 5) | గాయత్రీ మహామంత్రముతో ఆత్మాభిషేకము | 240 |
| 6) | బ్రాహ్మణ భోజనము | 24 |

(24 కనీసము అధిక సంఖ్య యైనను మంచిదే.)

26,66,664

వీలుంటే బ్రాహ్మణభోజన సంఖ్యకు దశాంశము మహాదానము అనగా గాయత్రీ దేవతకు సంబందించిన ధాన్య, వస్త్ర, లోహ దక్షిణలు ఈయవలెను.

(అన్నదానముకు దశాంశము 24=3 మహాదానము)

**" సర్వంశ్రీ గాయత్రీ మాతా దేవతా దివ్య చరణారవిందార్పణమస్తు "**

## ప్రతిదిన పునశ్చరణ జప విధానము ప్రారంభము

శ్లో॥ యజ్జాగ్రతో దూరముపైతీ దైవ్యం
యదుసుప్తస్య తదైవేతీ దూరం గమం
జ్యోతిషాం జ్యోతిరేకం తన్మే
మనఃశ్శివ సంకల్పమస్తు ॥ (3సార్లు పఠించాలి)

శ్లో ॥ సోమః సూర్యో యమః కాలః సంధ్యే భూతాన్యహః
క్షపా పవనో దిక్పతిర్భూమి రాకాశం ఖేచరా
మరాః బ్రహ్మశాసన మాస్థాయ కల్పద్వహి ॥
॥ ఇతి సర్వదేవతా ప్రార్థన ॥

అపవిత్రః పవిత్రోవా సర్వావస్థాంగతోఽపివా ।
యః స్మరేత్ పుండరీకాక్షం స బాహ్యాభ్యన్తరశ్శుచిః ॥
పుండరీకాక్ష । పుండరీకాక్ష ॥ పుండరీకాక్షః ॥।

## ఆచమనము

ఓం ఆచమ్య ............ఓం కేశవాయ స్వాహాః............

ఓం శ్రీకృష్ణాయనమః

## భూతోచ్చాటనము

(ఈ క్రింది మంత్రమును పఠించుచు భూతములను
వెడలగొట్టుచున్నట్లు భావింపవలెను)

ఉత్తిష్ఠన్తు భూతపిశాచాః యేతే భూమి భారకాః ।
ఏతేషామవిరోధేన బ్రహ్మ కర్మ సమారభే ॥

## ఆసన విధి

**ఓం పృథివ్యాః మేరు పృష్ఠఋషిః । కూర్మో దేవతా ।**
**సుతలం ఛందః। ఆసనే వినియోగః ॥ అనంతాసనాయనమః ॥**

పై మంత్రమును పఠించి ఆసనము క్రింద భూమిని కుడి
ఉంగరపు వ్రేలితో స్పృశించి చక్కగా కూర్చోవలెను.

## ప్రాణాయామము

**ఓం ప్రణవస్య పరబ్రహ్మ ఋషి ః । పరమాత్మ దేవతా ।**
**దైవీగాయత్రీ ఛందః। ప్రాణయామే వినియోగః ॥**

ఓం భూః । ఓం భువః ఓం సువః ఓం మహః ఓం జనః
ఓం తపః ఓంగ్ం సత్యం ఓం తత్సవితుర్వరేణ్యం భర్గో దేవస్య ధీమహి ధియెూయెూనః ప్రచోదయాత్ । ఓ మాపోజ్యోతి రసోమృతం బ్రహ్మాభూర్భువస్వరోమ్ ॥

## దేశకాల సంకీర్తన పూర్వక సంకల్పము

శుభాభ్యుదయార్థం చ శుభే శోభన మంగళముహూర్తే అత్ర పృథివ్యాం జంబూద్వీపే భరతవర్షే భరత ఖండే మేరోః దక్షిణదిగ్భాగే శ్రీ శైలస్య వాయువ్య (ఆగ్నేయ) ప్రదేశే శ్రీ కృష్ణాగోదావర్యోర్మధ్యదేశే లక్ష్మీ నివాస గృహే సమస్త దేవతా బ్రాహ్మణ హరిహర గురుచరణ సన్నిధౌ అద్యబ్రహ్మణః ద్వితీయ పరార్థే, శ్వేతవరాహ కల్పే, వైవస్వత మన్వంతరే కలియుగే ప్రథమపాదే అస్మిన్ వర్తమాన వ్యావహారిక చాంద్రమానేన.........నామ సంవత్సరే ........అయనే ..................ఋతే........మాసే.......పక్షే.......తిథౌ .......వాసరే......శుభనక్షత్రే......శుభయోగే........శుభకరణ ఏవం గుణ విశేషణ విశిష్టాయం శుభతిథౌ । మమ ఉపాత్తదురిత క్షయద్వారా శ్రీ పరమేశ్వర ముద్దిశ్య శ్రీ పరమేశ్వర ప్రీత్యర్థం పూర్వ సంకల్పిత "చతుర్వింశతీ లక్షాత్మిక " గాయత్రీ మహా మంత్ర పునశ్చరణ యథాంశేన.........సహస్ర గాయత్రీ మంత్ర జప మహం కరిష్యే ॥

తదంగ గణపతి ధ్యాన అంతర్ బహిర్మాతృకా
న్యాసాదికంచ కరిష్యే ॥
(తాము ఉన్న ప్రదేశము శ్రీశైలమునకు ఏ దిక్కున ఉన్నదో ఏ నదుల మధ్యన ఉన్నదో అని మార్చుకుని చెప్పవలయును.)

## ఓం శ్రీ గణేశాయ నమః

శ్రీపతిమాతులోయశ్చ జననీ సర్వమంగళ ।
జనకో శంకరో దేవో తం వందే కుంజరానన ॥
ఓం సుముఖశ్చైకదంశ్చ, కపిలోగజకర్ణకః లంబోదరశ్చ వికటో ।
విఘ్నరాజో వినాయకః ధూమకేతుర్గణాధ్యక్షో, ఫాలచంద్రోగజానన ॥

వక్రతుండశ్శూర్పకర్ణో, హేరంభః స్కంద పూర్వజః ।
షోడశైతాని నామాని యః పఠేచ్ఛృణుయాదపి ॥
విద్యారంభే వివాహేచ, ప్రవేశే నిర్గమే తథా
సంగ్రామే సంకటే చైవ, విఘ్నస్తస్యన జాయతే ॥

## అథః శ్రీ అంతర్మాతృకాన్యాసాః

అస్యశ్రీ మాతృకా సరస్వతీన్యాస మహామంత్రస్య
బ్రహ్మా ఋషిః గాయత్రీ ఛందః శ్రీ మాతృకా సరస్వతీ దేవతా
హల్భ్యో బీజే భ్యో నమః సర్వేభ్యః శక్తి భ్యో నమః
బిందుభ్యః కీలకేభ్యోనమః మమ శ్రీ విద్యాంగత్వేన న్యాసే వినియోగః

(సర్వ మాతృకయా సర్వాంగే అంజలినాతిర్వ్యాపకం కుర్యాత్)

ఓం అం కం ఖం గం ఘం జం ఆం  అంగుష్ఠాభ్యాం నమః
ఓం ఇం చం ఛం జం ఝం ఞం ఈం  తర్జనీభ్యాం నమః
ఓం ఉం టం ఠం డ ఢం ణం ఊం  మధ్యమాభ్యాం నమః
ఓం ఏం తం థం దం ధం నం ఐం  అనామికాభ్యాం నమః
ఓం పం ఫం బం భం మం ఔం  కనిష్ఠకాభ్యాం నమః
ఓం ఆం యం రం లం వం శం షం
సం హం ళం క్షం  కరతలకరపృష్ఠాభ్యాం నమః
ఓం అం కం ఖం గం ఘం జం ఆం  హృదయాయనమః
ఓం ఇం చం ఛం జం ఝం ఞ ఈం  శిరసేస్వాహా
ఓం ఉం టం ఠం డం ఢం ణం ఊం  శిఖాయైవౌషట్
ఓం ఏం తం థం దం ధం నం ఐం  కవచాయ హుం
ఓం పం ఫం బం భం మం ఔం  నేత్రత్రయాయవౌషట్
ఓం ఆం యం రం లం వం శం షం
ఓం సం హం ళం క్షం  అస్త్రాయఫట్

ఓం అం నమః ఓం ఆం నమః ఓం ఇం నమః ఓం ఈం నమః
ఓం ఉం నమః ఓం ఊం నమః ఓం ఋం నమః ౠం నమః
ఌ నమః ౡ నమః ఏ నమః ఓం ఐం నమః
ఓం ఓం నమః ఓం ఔం నమః ఓం అః నమః ఓం ఆః నమః
ఏతాన్ షోడష స్వరాన్ కంఠస్థానే శతేషోడష దళే విన్యసామి

